**భావము :**

పెక్కండ్రు రాజులున్నను వారిని లెక్కింపక కేవలము నలుని ముఖ్యముగఁ జేసికొని స్వయంవర మణ్డపమునుఁ బ్రవేశించిన దమయన్తి, యింద్రుని వరకు దేవతలను నిరాకరించుటవలన, వారికి లజ్జ యేర్పడుటయు, దానిని వారు యడిచిపెట్టుకొనుట సముచితమే. ఏలయనగా— "ఆహారేచ విహారేచత్యక్తలజ్జః సుఖీభవేత్" అని చెప్పినట్లు ఆహారవిహారాదుల యందు సిగ్గును వీడి వర్తించువానికే సుఖము గల్గును గాన దే.త. యా ప్రవర్తన సముచితము మఱియు నీ దమయన్తి దేవతల యనుగ్రహముచే పంచ లీ మమునందు తానెదుర్కొనవలసిన చిక్కుల నధిగమించి, సఫలమైన తన్ను వగుదైన నలునకొసంగి యా దేవతలకు సిగ్గుగాని, రోషముగాని యపకీర్తిగాని కల్గుట కవకాశము లేకుండఁ జేసినది. ఇంద్రాదులను నిరాకరించి నలుని వరించుటచే నాదేవతలకు లజ్జాదులు కల్గియుండెడివి. కాని వారి నారాధించి వారి యనుగ్రహముచే నలుని వరించినందువలన దేవతలకు బైవిధముగా లజ్జాదులు కలుగుట కవకాశము లేకపోయినదని యాశయము. 91

శ్లో॥ ఇత్యాక్షేపురను ప్రతీక
నిలయాలఙ్కారసారశ్రియా
ఉలఙ్కుర్వత్తను రామణీయక
మమూరాలోక్య పౌరస్త్రియః.
సానన్దం కురువిన్దసున్దర కరస్యానన్దనంస్యన్దనం
తస్యాధ్యాస్యయతః శతక్రతు
హరిత్క్రీడాద్రి మిన్దోరివ. **92**

ప॥వి॥ :- ఇతి - ఆక్షేపః - అన్వప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా - అలఙ్కుర్వత్తనురామణీయకమ్ - అమూః - ఆలోక్య - పౌరస్త్రియః - సానన్దం - కురువిన్దసున్దరకరస్య - ఆనన్దనం - స్యన్దనం - తస్య - అధ్యాస్య - యతః - శతక్రతుహరిత్క్రీడాద్రిమ్ - ఇందోః - అపి.

అర్థము :- కురువిన్దసున్దరకరస్య; కురువింద = పద్మరాగములవలె, సుందర = అందమైన, కరస్య = చేతులుగల, పక్షాన్తరమున— కురువిన్ద = పద్మరాగములవలె, సుందర = అందమైన, కరస్య = కిరణములు గల,

ఆనన్దనం=ఆనందమును గల్గించునట్టి, స్యన్దనం=రథమును, అధ్యాస్య=ఎక్కి, యతః=వెళ్ళుచున్న, ఇందోరివ=చంద్రునికివలె, అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా; అనుప్రతీక=ఒక్కొక్క యవయవమును, నిలయ=ఆశ్రయముగాఁ గల్గిన, అలఙ్కారసారశ్రియా: అలఙ్కారసార=శ్రేష్ఠమలైన, భూషణముల యొక్క, శ్రియా = కాన్తితో, అలఙ్కుర్వత్తను రామణీయకం; అలఙ్కుర్వత్ = అలంకరించుకొనుచున్న, తన = శరీరము యొక్క, రామణీయకం = అందమును, ఆలోక్య = చూచి, పౌరస్త్రియః = నగర స్త్రీలు, ఇతి = ముందుచెప్పిన విధముగా, సానందం = ఆనందముతోడ, ఆలేపుః = సంభాషించిరి.

## సమాసములు :

అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా :- ప్రతీకే, ప్రతీకే = అనుప్రతీకం, అనుప్రతీకం, నిలయః, యేషాన్తే = అనుప్రతీకనిలయాః, సారాశ్చతే, అలఙ్కారాశ్చ = అలఙ్కారసారాః. అనుప్రతీకనిలయాశ్చతే, అలఙ్కారసారాశ్చ = అనుప్రతీకనిలయాలఙ్కారసారాః, అనుప్రతీకనిలయాలఙ్కారసారాణాం, శ్రీః = అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రీః, తయా = అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా.

అలఙ్కుర్వత్తనురామణీయకం :- అలఙ్కుర్వతీచసా తనుశ్చ=అలఙ్కుర్వత్తనుః, రమణీయకస్య, భావః= రామణీయకం, అలఙ్కుర్వత్తనోః, రామణీయకం = అలఙ్కుర్వత్తనురామణీయకం, తత్ = అలఙ్కుర్వత్తనురామణీయకం. తత్ =

పౌరస్త్రియః :- పురే, భవాః = పౌరాః, పౌరాశ్చతా, స్త్రియశ్చ = పౌరస్త్రియః.

కురువిన్దసున్దరకరస్య :- కురువిన్దఇవసున్దరౌకరౌయస్యసః = కురువిన్దసున్దరకరః, తస్య = కురువిన్దసున్దరకరస్య.

పక్షాన్తరమున :- కురువిన్దాఇవసున్దరాఃకరాః యస్యసః =కురువిన్దసున్దరకరః, తస్య = కురువిన్దరకరస్య.

శతక్రతుహరిత్తీర్థాద్రిమ్ :- శతక్రతోః; హరిత్ = శతక్రతుహరిత్,

యాః, అద్రిః = క్రీడాద్రిః శతక్రతుహరితః, క్రీడాద్రిః = శత
హరిత్క్రీడాద్రిః, ౦మ్ = శతక్రతుహరిత్క్రీడాద్రిమ్.

రాగములవంటి హస్తములుగల్గి ఆనందము నొసంగెడి రథమునెక్కి
ఉన్న యానలుడు తూర్పుదిక్కులోని క్రీడాశైలమగు నుదయా
వెళ్ళుచున్న చంద్రుని శోభను వహించెను. మఱియు నా నలుని
కట నాభరణములను దొడగుటవలన వానిశోభ యొక్కొక్క యవ
ను నెలకొని గొప్పశోభను గల్గించుచుండెను. ఆ శోభను పౌర
పూర్వపు శ్లోకములయందు వర్ణింపఁబడిన నలసౌందర్యమును
ందముతో సల్లాపముఁ జేయుచుండిరి. 92

శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరస్సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం
మామల్లదేవీచయం.
యాతః పఞ్చదశః కృశేతరరస
స్వాదావిహాయం మహా
కావ్యే తస్యహివైరసేని చరితే
సర్గోనిసర్గోజ్జ్వలః. 93

హర్షం - కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః
షువే - జితేన్ద్రియచయం - మామల్లదేవీ - చ - యం - యాతః
ఞ్చదశః - కృశేతరరసస్వాదౌ - ఇహ - అయం - మహాకావ్యే-
- హి - వైరసేనిచరితే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

రాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క,
= పంక్తియొక్క, మకుట = కిరీటములకు, అలఙ్కార = భూష
లో, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుడను విద్వాం
జితేన్ద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియచయం =
యసమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను, సుతం =
, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీచ = మామల్ల

దేవి అను తల్లియు, యం = ఏవానిని, సుషువే = కనెనో, తస్య = అతని యొక్క, కృశేతరరసస్వాదౌ; కృశేతర = ఘనమైన, రస = శృఙ్గార రసముచే, స్వాదౌ = రుచియుక్తమైన, మహాకావ్యే = మహాకావ్యరూప కృతియైన, వైరిసేనిచరితే = వీరసేనమహారాజు పుత్రుడగు నలమహారాజుయొక్క, చరితే = చరిత్రమునందు. పఞ్చదశః = పదునైదవదైన, నిసర్గోజ్జ్వలః = స్వభావభాసురమైన, సర్గః = సర్గ, యాతః = కడచిపోయినది.

## సమాసములు:

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః :- కవీనాం, రాజానః = కవిరాజాః, కవిరాజానాం, రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః, మకుటాని = కవిరాజరాజిమకుటాని, కవిరాజరాజిమకుటేషు, అలఙ్కారాః = కవిరాజరాజిమకుటాలఙ్కారాః, కవిరాజరాజిమకుటాలఙ్కారేషు, హీరః = కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః.

జితేన్ద్రియచయం ;- ఇన్ద్రియాణాం, చయః = ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః, యేనసః = జితేన్ద్రియచయః, తమ్ = జితేన్ద్రియచయం.

పఞ్చదశః ;- పఞ్చ దశానాం, పూరణః = పఞ్చదశః.

కృశేతరరసస్వాదౌ :- కృశాత్, ఇతరః = కృశేతరః, కృశేతరశ్చాసౌ, రసశ్చ = కృశేతరరసః, కృశేతరరసేన, స్వాదు = కృశేతరరసస్వాదు, తస్మిన్ = కృశేతరరసస్వాదౌ.

వైరసేనిచరితే ;- వీరసేనస్య, అపత్యంపుమాన్ = వైరసేనిః, వైరసేనేః, చరితం, వైరసేనిచరితమ్, తస్మిన్ = వైరసేనిచరితే.

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ, ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

## భావము :

కవిశ్రేష్ఠుల మకుటములలోని విభూషణములలో వజ్రమణియైన శ్రీహీరుడు ఇంద్రియనిగ్రహముఁ గావించిన శ్రీహర్షుని జన్మింపఁజేసెను. మామల్లదేవియను తల్లియు నితనిని గనెను. ఘనమైన శృఙ్గారరసముతో రుచులు గొల్పునట్టి యా

ుత్రియైన మహాకావ్యమగా నొప్పుచున్న వైరసేని చరిత్రమనియు,
నైషధీయ చరితముందు స్వభావ భాసురమగు పదునైదవ సర్గ
ుదినది 92

ఇతి
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలి నరసింహసూరి
తనూజ సుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
పఞ్చదశసర్గ సమాప్తము.
ఓం
శమ్.